శ్రీ సద్గురవే నమః.

శ్రీ శివరామదీక్షిత గురుపీఠము.

వేదాంతసారసంగ్రహా[illegible]

# భద్రాద్రిరామశతక భా[illegible]ము.




ఇది

ఆత్మబోధకులైన

శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర స్వాముల వారిచే

ముముక్షువులకొఱకు రచియింపబడి

సికింద్రా హైదరాబాదు రెసిడెంసీ ఈసామియ్యా బజారు

సాహుకారి మీపకాయల యెల్లయ్యగారి ప్రేరేపణచే


బెజవాడ పూలబావి వీధిలో మంజరీ ముద్రాక్షరశాలయందు

జేతపాడి భగవంతరావుగారిచే ముద్రింపబడి

గ్రంథకర్తగారిచే ప్రకటింపబడియె

మొదటికూర్పు ౧౦౦౦ ప్రతులు.

22-4-1916.




వెల అ ౧-౧-౦.

శ్రీ సద్గురుభ్యోనమః

# శ్రీ శివరామదీక్షిత గురుసంప్రదాయం.

## పీఠిక.

శ్రీమ దఖండసచ్చిదానందాతీత అచలపరిపూర్ణ శ్రీ నిజ గురుసార్వభౌములైన శ్రీధరస్వాములవారును, శ్రీధరస్వాములవారి ప్రియశిష్యరత్న మగు బృహద్వాసిష్ఠ అచలబోధగ్రంథస్థాపనాచార్యులైన శ్రీమ ద్రామడగు శివరామదీక్షితులవారును, శ్రీశివరామ, దీక్షితులవారి ప్రియశిష్యుడగు శ్రీమత్కంబాలూరు అప్పారావుగారును, శ్రీ అప్పారావుగారి ప్రియశిష్యులగు శ్రీమత్పరశురామ సీతారామయ్యగారును శ్రీమత్పరశురామ నరసింహదాసుగారును, శ్రీ సీతారామయ్యగారి ప్రియశిష్యుడగు శ్రీమద్భాగవత కృష్ణయ్యగారును శ్రీకృష్ణయ్యగారి ప్రియశిష్యుడగు శ్రీమత్పిల్లాన లక్ష్మణరావుగారును శ్రీ లక్ష్మణరావుగారి ప్రియశిష్యుడగు శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వర స్వాములవారును.

శ్రీ సచ్చిదానంద వేంకటేశ్వరస్వాములవారిచే శ్రీమత్పరశురామ నరసింహదాసుగారు రచియించిన భద్రాద్రిరామశతకము ముముక్షువులకు సులభంబుగా తెలియునటుల, భావార్థములుగా వ్రాయబడి వారియొక్క నిజభక్తులైన

౧. మందిప్పల హనుమంతరావుగారు — మక్తల్
౨. బి. రాంసింగుగారు, — బెజవాడ
౩. తిరువగిరి వెంకయ్యగారు, — డిటో
౪. చిత్తులూరు గంటలరాయుడుగారు, — డిటో
౫. మొ. పొన్నురంగం మొదలియారుగారు — డిటో
౬. తిరువగిరి కృష్ణయ్యగారు — డిటో
౭. పంపాన రామయ్యగారు — డిటో



శ్రీ సద్గురవేనమః.

శ్రీ శివరామదీక్షిత గురుపీఠము.

వేదాంతసార సంగ్రహ మను

# భద్రాద్రిరామశతక భావార్థము.

౧ స్తోత్రములు. ౬

౧. శ్రీగణపతిని భక్తితో స్మరియించి, స్తోత్రముజేసి, బ్రహ్మను నుతియించి, శ్రీహరి చరణములను చిత్తమందున నిలిపి, యీశ్వరుని సదా సేవించి, ఇంద్రాది సమస్తదేవతలను యాచించి, సనకాదిమునులను స్తుతియించి, గురుపాదపద్మములను స్తోత్రముజేసి, షోడశోపచారములతో పూజసలిపి, బ్రహ్మవేత్తలను విజ్ఞాపనజేసి, తెనుగు సంస్కృతకవులను వేడుకొని, ప్రారంభించిన శతకమును అంగీకరించుమయా, మనోహరమైన గుణములతో ప్రకాశించుచు భద్రాచలమునందుండు శ్రీ రామా, పరశురామ నరసింహదాసుని రక్షించు నామముగలవాడా.

౨. లక్ష్మీస్వరూపురాలైన సీతాదేవికి మనోహరుడైనవాడా, దేవతలచే సేవింపబడినవాడా, రఘువంశమనే సముద్రమునకు చంద్రుడైనవాడా, పాపములను పోగొట్టెడువాడా, పామరులను పవిత్రముజేసెడి పేరుగలవాడా, దివ్యమైన యుత్కృష్టస్థానముగలవాడా, దయచేత సుందరమైనవాడా, యుద్ధమునందు భీకరస్వరూపము గలవాడా, మేఘముపలెనే నల్లని రూపు గలవాడా, శ్రేష్ఠమైన తులసిమాల గలవాడా, అతిశయమైన బలముచేత మూడులోకములకు మనోహరమైనవాడా, పరశురాముని జయించినట్టివాడా, మునిబృందముచే స్తుతింపబడినవాడా, నిండు కోరికగలవాడా, సత్పురుషశ్రే

షుడా, భక్తులకు కల్పవృక్షమువంటివాడా, మేరుపర్వతముతో సమానమైన ధైర్యముగలవాడా, భయమును బోగొట్టెడివాడా, రాక్షసులను సంహారించినవాడా, పరిశుద్ధమైన యుపనిషద్వాక్యములయొక్క సారమును గలవాడా, మనోహరమైన గుణములతో ప్రకాశించుచు భద్రాచలమునందు ఉండెడి శ్రీరాముడా, పరశురామ నరసింహదాసుని రక్షించెడి నామముగలవాడా!

3. వేదములను విచారించి శ్రవణముజేయు నభ్యసించలేదు, శాస్త్రములను పురాణములను చదువుకోలేదు, తెనుగును సంస్కృతమును నేర్చుకోలేదు, ఉపనిషత్తుల ధర్మములను విచారించలేదు, లక్షణగ్రంధములను చూడలేదు, పెద్దల సాంగత్యమును జేయలేదు, అలంకారగ్రంధములను కావ్యములను నాటకములను, జూడలేదు, మీయొక్క అనుగ్రహము నాయందు విశేషముగా నుండుటచే మీపేరట సీసశతకమును కృతిచేయ ప్రారంభించితిని, గనుక తప్పులేకుండ అనుగ్రహించి యీభూమియందు కవీశ్వరులు మెచ్చునట్లు చేయుము మనోహరమైన గుణములతో ప్రకాశించుచు భద్రాచలమునం దుండెడి శ్రీ రామా పరశురామ నరసింహదాసుని రక్షించునామము గలవాడా!

4. నీలమేఘమువంటి నీ దేహమును, పద్మరాగమణియొక్క కాంతిగలిగిన చరణకమలములు రెండును, ఆదిశేషునితో సమానమైన భుజములును, సింహముయొక్క నడుమును పరిహాసముచేసెడి వేదమును నువ్వుపువ్వువంటి ముక్కును, పగడముయొక్క కాంతిగల పెదవులును, కమలములనుమించు పరిశుద్ధమగు నేత్రములును, పున్నమనాటిచంద్రునితో సమానమైన ముఖమును నూరుకోట్ల మన్మధులయొక్క సౌందర్యమును గలయట్టిస్వరూపమును బ్రహ్మకైనను వర్ణనచేయనలవిగాదు, మనోహరమైన గుణములతో ప్రకాశించుచు భద్రాచలమునందు శ్రీ రామా పరశురామ నరసింహదాసునిర

క్షించు నామముగలవాడా!

౫. కేశవ, గోవింద, కృష్ణ, దామో[illegible], అచ్యుత నరసింహ, మధుసూదన, త్రివిక్రమ, జనార్దన, ముకుంద, వైకుంఠ, వామన, వాసుదేవ, పుండరీకదళాక్ష, పురుషోత్తమ, ఉపేంద్ర, పరమాత్మ, పరమేశ, పద్మనాభ, మాధవ, అధోక్షజ, మధువైరి, శ్రీహరి, విష్ణు, విశ్వంభర, విశ్వనాథ, శ్రీధర, అనంత, చిద్రూప, శ్రీనివాస, పుణ్యచరిత్రములు గలవాడా, దేవతలచే స్తుతింపబడినవాడా, పురుషోత్తముడా! మనోహరమైన గుణములతో ప్రకాశించుచు, భద్రాచలముననుండు శ్రీ రామా, పరశురామ నరసింహదాసుని రక్షించు నామముగలవాడా!

౬. శాశ్వతుడా, ఆకారరహితుడా, ఉపద్రవము లేనివాడా, పరిపూర్ణమైనవాడా, మలినరహితమైనవాడా, గుణరహితమైనవాడా, కళంకము లేనివాడా, కర్మము లేనివాడా, క్రియ లేనివాడా, సాంగత్యము లేనివాడా, సమానము లేనివాడా, ఉపమానము లేనివాడా, యింద్రియము లేనివాడా, వికల్పము లేనివాడా, ప్రపంచము లేనివాడా, నాశము గానివాడా, చలనము లేనివాడా, శబ్దము లేనివాడా, చెప్పుటకు శక్యముగాని ఆనందరూపము గలవాడా, వికారము లేనివాడా, విశేషము యేమి లేనివాడా, తలచుటకు శక్యము కానివాడా, మిక్కిలి అతిశయమైన సంతోషముగలవాడా, నీయొక్క నిజస్వరూపమును సందేహములేక, బ్రహ్మ ఈశ్వరుడు, యింద్రుడు, మొదలైన దేవతలు వర్ణించుటకు శక్యముగాదు! మనోహరమైన గుణములతో ప్రకాశించుచు, భద్రాచలముననుండు శ్రీరామా పరశురామ నరసింహదాసుని రక్షించు నామముగలవాడా!

---

## ౨. సాంఖ్యయోగము. ౮౧

### ౧. ప్రపంచోత్పత్తి లక్షణం

౭. ఆత్మయందు ఆకాశము, ఆకాశమందు వాయువు, వాయువం

దు అగ్ని, అగ్నియందు జలము, జలమందు పృథివి, పృథివియందు ఓషధులు, ఓషధులందు అన్నము, అన్నమునుంచి నరులాది సకల జంతుజాలము లాయెను. ఈరీతిగా పిండబ్రహ్మాండములు పరమాత్మ మాయవలన ఆయెను.

౨. నరప్రమాణలక్షణం.

౮. —౯౬ అంగుళములు నరప్రమాణము, ౮ జానలు పొడవు, ౪ జానలు వెడల్పు, ౩౩ కోట్ల రోమములు, ౭౨ వేల నరములు, ౬౬ ఎముకలు, ౯౨ కీళ్లు, ౩౩ మూళ్ల పెద్దపేగు, ౧ శేరు గుండె, ౫ శేరు నెత్తురు, ౧ మణువు ౪ శేరులు మాంసము, ౨ సోలెడు పైత్యము, ౫ సోలెడు శ్లేష్మము, విచారించగా సకలదేహము లీ ప్రకారముగా నుండును.

౩. తొంబదియాఱు తత్త్వములు.

—౫ జ్ఞానేంద్రియములు, ౫ కర్మేంద్రియములు, ౫ విషయేంద్రియములు, ౫ కోశములు, ౪ అంతఃకరణములు, ౮ వాగాదులు, ౧౦ నాడులు, ౧౪ వాయువులు, ౭ ధాతువులు, ౫ భూతములు, ౬ చక్రములు, ౩ మలములు, ౪ అవస్థలు, ౩ మండలములు, ౩ ఈషణములు, ౩ వ్యాధులు, ౩ గుణములు, ౩ తనువులు, కూడి ౯౬ తత్త్వములాయెను, వీటికి పరమాత్మ సాక్షియని యెరుగవలెను

౪. పంచభూతలక్షణం.

౧౦. పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, ౫భూతములు. వీటియందు రక్తము, శుభ్రము, అసితము, ధూమ్రము, సునీలము, ౫ వర్ణములు. గంధము, రసము, రూపము, స్పర్శ, శబ్దము, ౫ గుణములు. క్రియా, ఇచ్ఛా, జ్ఞాన, ఆది, పరా, ౫ శక్తులు. ల, వ, ర, య, అ, ౫ బీజములు. బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివుడు, ౫ దేవతలు ఉండును.

౫ పంచభూతగుణాల లక్షణం.

౧౧. భూమికి శబ్ద స్పర్శ రూప రస గంధములు౫ గుణములు. జలానికి శబ్ద స్పర్శ రూప రసములు ౪ గుణములు. అగ్నికి శబ్ద స్పర్శ రూపములు ౩ గుణములు. వాయువుకు శబ్ద స్పర్శములు ౨ గుణములు. ఆకాశమునకు శబ్దము ౧ గుణము.

౬ పంచీకరణ లక్షణం.

౧౨ ఆకాశపంచకము జ్ఞానము మనసు బుద్ధి చిత్తము అహంకారము. ౫ అంతరేంద్రియములు. వాయుపంచకము సమానము వ్యానము ఉదానము ప్రాణము అపానము. ౫ ప్రాణేంద్రియములు. అగ్ని పంచకము శ్రోత్రము త్వక్కు చక్షు జిహ్వ ఘ్రాణము. ౫ జ్ఞానేంద్రియములు. ౫ జలపంచకము శబ్దము స్పర్శ రూపము రసము గంధము. ౫ విషయేంద్రియములు. పృథివిపంచకము వాక్కు పాణి పాదము గుహ్యము గుదము ౫ కర్మేంద్రియములు. యిన్నిటినియోగిన యెరుకయే పరమాత్మలని తెలిసికొనుటయే సాంఖ్యము.

౭. పంచభూతాంశములు.

౧౩. జ్ఞానము సమానము శ్రోత్రము శబ్దము వాక్కు. ౫ ఆకాశాంశములు. మనస్సు వ్యానము త్వక్కు స్పర్శ పాణి ౫ వాయువంశములు. బుద్ధి ఉదానము చక్షు రూపము పాదము. ౫ అగ్నిఅంశములు. చిత్తము ప్రాణము జిహ్వ రసము శిశ్నము. ౫ జలాంశములు. అహంకారము అపానము ఘ్రాణము గంధము గుదము. ౫ పృథివిఅంశములు.

౮ పంచభూత గుణములు.

౧౪. ఎముకలు చర్మము గోళ్ళు వెంట్రుకలు మాంసము. ౫ భూగుణములు. చెమట మూత్రము రక్తము శుక్లము శోణితము. ౫ జలగుణములు. ఆకలి దప్పి అలస్యము నిద్ర సంగము ౫ అగ్నిగుణములు. పరుగుట తిరుగుట ముడుచుట చాచుట దాటుట. ౫ వాయు

గుణములు. కామము క్రోధము లోభము మోహము భయము. ౫ ఆకాశగుణములు.

౯ పంచకోశ నిర్ణయం.

౧౫. అన్నరసముతోనైన దేహము అన్నమయము. ప్రాణేంద్రియములును కర్మేంద్రియములునుగూడి ప్రాణమయము. జ్ఞానేంద్రియములును మనస్సునుగూడి మనోమయము. జ్ఞానేంద్రియములును బుద్ధియునుగూడి విజ్ఞానమయము. ప్రకృతియందు మనసులీనమౌట ఆనందమయము.

౧౦. పంచప్రాణాల నిర్ణయం.

౧౬. సమానము నాభియందుండి నాల్కకన్నరసంబంచును. వ్యానము సర్వాంగములందునిండి శీతోష్ణములనెరిగించును. ఉదానము కంఠమందుండి పలికించును. ప్రాణము హృదయమందుండి ఉచ్ఛ్వాసాలునడుపును. అపానము పాయూపస్థలయందుండి మలమూత్రములు వెళ్ల జేయును.

౧౧. ఉపవాయువులు.

౧౭. నాగుడుఆవలింపజేయును. కూర్ముడు ఉన్మీలనము జేయును. కృకరుడు తుమ్మించును. దేవదత్తుడు ఒడలువిరిపించును. ధనుంజయుడు చచ్చినదేహమును వాచజేయును. అంతర్యామి ప్రపంచకుడు నరునకువాహనములు.వజ్రుండు ముఖ్యుండుచీలవలెకీళ్ళయందుండును

౧౨. సప్తధాతువులలక్షణం.

౧౮. రసము రుధిరము మాంసము మేదస్సు మజ్జఆస్థి రేతస్సులు యివిసప్తధాతువులు గూడి దేహికి ఆవరణములైన దేహమయి ఆపాదమస్తకపర్యంతమునిండి ప్రకృతిభేదములచేత పరిణమించి స్థూలముగాను దీర్ఘముగాను సూక్ష్మముగాను నటియించి అచ్చటచ్చట ఘటనము జెందుచుండును గనుక యిటువంటి దేహములందు ఖ్యాతి విడువవలెను.

### ౧౩. శరీరత్రయలక్షణం.

౧౯. జ్ఞానేంద్రియములు ౫, కర్మేంద్రియములు ౫, అంతరేంద్రియములు ౫, విషయేంద్రియములు ౫, ప్రాణేంద్రియములు ౫, యీ ౨౫ తత్వములుగూడి స్థూలశరీర మాయెను.

జ్ఞానేంద్రియములు ౫, కర్మేంద్రియములు ౫, ప్రాణేంద్రియములు ౫, మనోబుద్ధులు ౨, యీ ౧౭ తత్వములు గూడి సూక్ష్మశరీర మాయెను.

ఈ రెండు శరీరములకు మూలమై, అనాద్యవిద్యాకృతమై, కారణశరీర మాయెను.

ఈమూడుశరీరములకు విలక్షణమైనదిఆత్మయనియెరుగవలెను.

### ౧౪. చతుర్దశేంద్రియ విషయములు.

౨౦. చెవులకు శబ్దము, చర్మమునకు స్పర్శ, నేత్రమునకు రూపము, జిహ్వకు రసము, ముక్కుకు గంధము, వాక్కుకు వచనము, కరమునకు దానము, పాదమునకు గమనము, గుహ్యమునకు ఆనందము, గుదమునకు విసర్జన, మనస్సుకు కల్పన, బుద్ధికి నిశ్చయము, చిత్తమునకు చింతన, అహంకారమునకు అభిమానము, ఇన్నిటిని తెలిసినదే యెరుకసుమా.

### ౧౫. చతుర్దశేంద్రియాధిదేవతలు.

౨౧. చెవులకు దిక్కులు, చర్మమునకు వాయువు, నేత్రములకు సూర్యుడు, జిహ్వకు వరుణుడు, ముక్కుకు అశ్వినులు, వాక్కునకు అగ్ని, పాణికి ఇంద్రుడు, పాదములకు ఉపేంద్రుడు గుహ్యమునకు బ్రహ్మ, గుదముకుమృత్యువు, మనస్సుకు చంద్రుడు, బుద్ధికి బృహస్పతి, చిత్తమునకుజీవుండు, అహంకారమునకు శివుడు.

### ౧౬. జాగ్రదవస్థ లక్షణం.

౨౨. జీవుడు పంచవింశతితత్వాత్మకమైన తనువునుగూడి చతుర్దశేంద్రియవిషయము లనుభవిస్తూ నేత్రస్థానమందు విశ్వుడనేపే

ర నిలచి సకలవ్యవహారములు జేయుచుండును ఇదియే జాగ్రదవస్థ.

౧౭. స్వప్నావస్థ లక్షణం.

౨౩. జీవుడు దశేంద్రియ విషయములను స్థూలమందుంచి పంచప్రాణ మనోబుద్ధి దశేంద్రియ సమన్వితమైన (౧౭) తత్వములగు సూక్ష్మతనువును గూడి, కంఠమందు తైజసుడనే పేరున నిలచి జాగ్రత వ్యవహార క్రియలు చేయుచునుండును. ఇదియే స్వప్నావస్థ. మేలుకొని చూడగా యేమియు లేదు. గనుక యిది సత్యముగాదు.

౧౮. సుషుప్త్యవస్థ లక్షణం.

౨౪. జీవుడు అహంకారచిత్తములను కంఠమందుంచి, మనోబుద్ధుల దీసికొని, కారణదేహముయొక్క హృత్కమలమందు జేరి, అజ్ఞాన సన్నిధియందు నిలచి, ప్రాజ్ఞుడనెడి పేర నుండును. ఇదియే సుషుప్త్యవస్థ.

జీవుడు మనోబుద్ధుల విడిచి, అవిద్యనుగూడి లీనమై మూర్ఛయందు ప్రత్యగాత్మయనే పేరను నిలచి యుండును. ఇదియే తుర్యావస్థ. శరీరమీద సర్పము బారినను స్మృతితప్పియుండుట.

౧౯. సత్వగుణాలక్షణం.

౨౫. సత్యము, వ్రతము, ఆచారము, సత్కర్మము, తపస్సు మానము, ఉత్సాహము, ధర్మమార్గము, శమాదిషట్కము, శాస్త్ర పురాణ శ్రవణము, ధ్యానము, సుజ్ఞానము, సన్యాసము, దానము ధైర్యము, నిశ్చయము, సుబుద్ధి, సద్భక్తి, భూతదయ, సత్సంగము, ఈగుణములు కలవాడు సాత్వికుడు.

౨౦. రజోగుణాలక్షణం.

౨౬. కామము, క్రోధము, గర్వము, కర్తృత్వము, పరరాష్ట్రపీడితము, పరధనేషణ, పరస్త్రీసంగము, నేరములవినుట, డంబము, ఉద్యోగము, రణరంగచింత, భోగేచ్ఛ, భాగ్యేచ్ఛ, ఆత్మస్తుతి, ఈగుణములు గలవాడు రాజసుడు.

### ౨౧. తమోగుణ లక్షణం.

౨౭. అజ్ఞానము, మోహాంధకారము, అతినిద్ర, ఒరులుతిన్నరుగ కునికి, కొట్టుట, తిట్టుట, కోపపడుట, అత్యాహారము, అతిపానము, పాతకి, దుర్భాషి, పరనింద, లజ్జాత్యాగి, బుద్ధిహీనత్వము, సంసార బద్ధత్వము, కుటిలసంగము, ఈ గుణములు గలవాడు తామసుడు.

### ౨౨. గుణత్రయవిభాగనిర్ణయం.

౨౮. సాత్వికగుణునకు 3 పాళ్లు సత్వం ౨ పాళ్లు రాజసం ౧ పాలు తామసం. రాజసగుణునకు 3 పాళ్లు రాజసం ౨ పాళ్లుసత్వం ౧ పాలు తామసం. తామసగుణునకు 3 పాళ్లు తామసం ౨ పాళ్లు రాజసం ౧ పాలు సత్వం. ఈ ప్రకారము త్రిగుణములు దేహము లందుండును. సాత్వికగుణముగల్లవాడు గురుముఖంబున పరమాత్మ ను ఎరుగుచుండును.

### ౨౩. దశనాడుల స్థాననిర్ణయం.

౨౯. గాంధారి, హస్తిను లు నేత్రములందుండును. పూషా అలంబ శ్రోత్రములందుండును, జిహ్వా షట్క్రమం దుండును. శంఖని నాభియం దుండును. కుల, శినీవాలి, రత్నావ్యాయు, గుదగుహ్యము లందుండును. పయస్విని కంఠమందుండి క్షుత్పిపాసల నెరిగించును.

### ౨౪. సుషుమ్నానాడి లక్షణం.

౩౦ కుడిముక్కు ఇడ, ఎడమముక్కు పింగళ, ఈ రెంటికి నడు మ సుషుమ్నానాడి యుండును. దాని అగ్రరంధ్రమందు, సూర్యుడు, చంద్రుడు, అగ్ని, విద్యా, అక్షరము, ఛాయ, ఆత్మ, సప్తసముద్ర ములు, సప్తపర్వతములు, చతుర్వేదములు, శాస్త్రములు, పంచ భూతములు, సప్తద్వీపములు, లోకములు, గుణములు, మంత్రము లు, కళలు, బిందువు, నాదము, దిక్కులు, వాయువులు, బీజము లు ఈ మొదలైన సకలదృశ్యపదార్థములు గూఢియుండును.

### ౨౯. చతుర్దశలోక నిర్ణయం.

3౧. అతలము పాదములు, వితలము గుబ్బలు, సుతలము జంఘలు, తలాతలము జానువులు, మహాతలము ఊరువులు, రసాతలము గుహ్యము, పాతాళముకటి, భూలోకము నాభి, భువర్లోకము ఉదరము, స్వర్గలోకము హృదయము, మహర్లోకము వక్షము, జనలోకము గళము, తపోలోకము భ్రూమధ్యము, సత్యలోకము మూర్ధ్ని.

### ౩౦. అష్టదిక్పాలకుల స్థల నిర్ణయం.

3౨. భ్రూమధ్యమందు ఇంద్రపురము తూర్పుదిక్కు
కుడికంటియందు అగ్నిపురము ఆగ్నేయమూల
కుడిచెవియందు యమపురము దక్షిణదిక్కు
కుడిపార్శ్వమందు నైరుతిపురము నైరుతిమూల
పృష్ఠమందు వరుణపురము పశ్చిమదిక్కు.
ఎడమపార్శ్వమందు వాయుపురము వాయువ్యమూల.
ఎడమచెవియందు కుబేరపురము, ఉత్తరదిక్కు
ఎడమకంటియందు, శివపురము. ఈశాన్యమూల

### ౩౧. షడూర్ముల లక్షణం.

33. సకలజీవులకు, క్షుధ, తృష్ణలు ప్రాణధర్మములు. శోక, మోహములు మనోధర్మములు. జనన, మరణములు దేహధర్మములు. ఇవిషడూర్ములని విచారించి విడిచిపెట్టి గురుముఖమునపరమాత్మను ఎరుగవలెను.

### ౩౨. అష్టమదముల లక్షణం.

3౪. ఎక్కువకులమనుట కులమదము, ఆచారము శీలమదము, ద్రవ్యము కలుగుట ధనమదము, సుందరము రూపమదము.

3౫. బలము యవ్వనమదము, చదువువచ్చుట విద్యామదము, దేశాధిపత్యము రాజ్యమదము, అనుష్ఠానము తపో మదము. ఇటు

33. వాసనత్రయ లక్షణం.

౪౦. లౌకికవృత్తిచేత లోకానుసారిగా నుండుట లోకవాసన. శాస్త్రోక్తముగా జపతపవ్రతాదులు చేయుట శాస్త్రవాసన. దేహసంరక్షణజేసి, తీర్థయాత్రలకు దిరుగుట దేహవాసన. ఈ మూడు వాసనలను కోరక, సద్గురువునకు శుశ్రూషలుజేసి, సద్గుణములను వదలి తత్త్వమస్యాది మహావాక్య తాత్పర్యముచేత తన్ను తా నెరిగిన వాడు అద్వైతి యగును.

3౪. వ్యాధిత్రయ లక్షణం.

౪౧. వాతరోగములు ౮౦ పైత్యరోగములు ౬౪, శ్లేష్మరోగములు ౨౨౪, ఈ మూడురోగములు గూడి ౩౬౮ అయినవి ఇటు వంటివ్యాధులకుఆధారమైనదేహభ్రాంతివిడిచినవాడు బ్రహ్మవిదుడు.

3౫. జన్మహేతు లక్షణం.

౪౨. ఆత్మయందు మాయారోపితము, మాయయందు అజ్ఞానము, అజ్ఞానమందు అవివేకము, అవివేకమందు అభిమానము, అభిమానమందు రాగాదులు, రాగాదులందు కర్మము, కర్మమువల్ల దేహములుబుట్టెను. ఇటువంటి దేహము లెత్తినవారు ఆత్మనెరుగలేరు.

3౬. ప్రపంచభ్రాంతి లక్షణం.

౪౩. రజ్జువందు సర్పము, శుక్తియందు రజతము, స్థాణువందు పురుషుడు, కలలోపల మేలు. ఏలాగు అసత్యమో, ఆలాగే లేని ప్రపంచము తోచెను. ఈ మానవులు జ్ఞానమార్గముచే నిజస్వరూపము గానలేక, ప్రపంచము సత్యమని నమ్మినారు.

3౭. అనాత్మ లక్షణం.

౪౪. జన్మము, అస్థి, వృద్ధి, క్షయము, పరిణామము, వినాశము, షడ్విధవికారములును, బాల్యముయౌవనము కౌమారము, వార్థక్యము, అవస్థాత్రయమును, మహదహంకారము, ఆకాశము, వాయువు, అ

గ్ని, జలము పృథివి, పంచభూతములును, త్రిగుణములును, దేహత్రయములును, పంచకోశములును అంతరేంద్రియములును, బాహ్యేంద్రియములును, దృశ్యమును, దృక్కును, శ్రుతమును అనాత్మ యని యెఱుగవలయును.

౩౮. సాధనచతుష్టయ సంపత్తి లక్షణము.

౭౫. బ్రహ్మసత్యము జగ మసత్య మనియెరుగుటనిత్యానిత్య వస్తువివేకము. ఇహపరభోగము లిచ్ఛయించక పాపపుణ్యములు బడయక యుండుట ఇహాముత్రార్థఫలభోగవిరాగము. శమము దమము శాంతి తితీక్ష శ్రద్ధ ఉపరతి గలుగుట శమాది షట్కసంపత్తి మోక్షాపేక్షతప్ప యితరాపేక్షలేక యుండుటము ముముక్షుత్వము. ఇవి గురుకటాక్షముచే తెలిసికొని ఆత్మయందుఐక్యముగావలెను.

౩౯. శమాది షట్క సంపత్తి నిర్ణయము.

౭౬. అంతరేంద్రియ నిగ్రహము శమము, బాహ్యేంద్రియ నిగ్రహము దమము, అరిషట్కజయము శాంతి, సుఖదుఃఖసహనము తితీక్ష, గురువాక్యనిష్ఠ శ్రద్ధ, కర్తృత్వము లేక కర్మము జేసి ఆత్మ నెరుగుట ఉపరతి, అని యెఱిగి నడిచినవాడే యోగీశ్వరుడు.

౪౦. అరిషడ్వర్గ లక్షణం.

౭౭. కోరుట కామము, కోర్కెకొనసాగకునికి క్రోధము, వచ్చినద్రవ్యము వదలకునికి లోభము, ద్రవ్యాపేక్ష మోహము, ధనము కలదని యుబ్బుట మదము, స్వద్రవ్యాపహారులమీద యీర్ష్య మత్సరము, గనుక యీ అరిషడ్వర్గముల నణచి శాంతిజెందవలెను.

---

౩. తా ర క యో గ ము. ౧౭

౧ ఉపదేశక్రమము.

౭౮ సాధనచతుష్టయసంపత్తి గలిగి, పరిపూర్ణుడైన సద్గురుని నాశ్రయించి, ద్వాదశనమస్కారములు చేసి, తను మన ధనంబులు

ధారవోసి, భక్తితో ఆత్మ అంగ స్థాన భావ చతుర్విధశుశ్రూషలు సలిపి, త్రికరణశుద్ధిగా షోడశోపచారములతో సంతోషపరచినట్టి శిష్యుని మెచ్చి, సద్గురుమూర్తి తీర్థప్రసాదములిచ్చి, స్వస్తికారోహణస్పర్శ త్రివిధదీక్షలొనరించి, హస్తమస్తకసంయోగముగావించి తారకమంత్రోపదేశ మొనరించును.

౨ గురుడు బోధించు నిర్ణయం.

౪౯ యమ నియ మాసన ప్రాణాయామ ప్రత్యాహార ధ్యాన ధారణ సమాధ్యష్టాంగయోగములును, మంత్ర, లయ, హఠ, రాజయోగములును, తారక సాంఖ్యామనస్కములును, ఆసనముద్రలక్ష్యధ్యానములును, జ్యోతిదర్శనమును, మహావాక్యార్థలక్ష్యార్థములును, క్రమముగా సద్గురుమూర్తి శిష్యునకు బోధించి, తనుపరి పెద్దలుమెచ్చునట్లు పరిపూర్ణబోధను దెలిపి కృతార్థుని జేయును.

౩ ధ్యానముద్ర మంత్రయోగ లక్షణం.

౫౦ స్నానముజేసి, శుభ్రవస్త్రము కట్టుకొని, శుచియైన స్థలమందు, కూర్మచక్రము లిఖించి, దర్భ కృష్ణాజిన వ్యాఘ్రాసనములు పరచి, దానిమీద పద్మాసనస్థుడై కూర్చుండి కన్నులుమూసి, వెన్ను నిక్కించి, నాసాగ్రమందు దృష్టి నిలిపి, మనసు కిష్టమైన మంత్రము జపించవలయును.

౪ ఆధారయంత్రముద్ర లయయోగం.

౫౧ రెప్పలువాల్చక రెండుచూపులు భ్రూమధ్యమందు నిలిపి, తర్జనలచే కర్ణరంధ్రములు బిగియించి, అంతర్దృష్టిచే, గజ్జె, మువ్వలు ఘంటా, శంఖు, వీణ తాళ, వేణు, భేరీ, మద్దెళ, మేఘ, దశవిధనాదము లాలకించి, తుదినాదమగు మేఘనాదమందు మనసు లయము చేయవలెను.

౫ షణ్ముఖీముద్ర హఠయోగం.

౫౨ అంగుష్ఠములచే చెవులును, తర్జనమధ్యమములచే కన్నుల

ను, అనామికములచే ముక్కు రంధ్రములను, కనిష్ఠికములచే నోరును పాదమూలములచే పాయూపస్థలను మూసి ఆధారమునుంచి వాయువును లేపి క్రమముగా స్వాధిష్ఠాన మణిపూరక అనాహత విశుద్ధ ఆజ్ఞేయ చక్రములకు తెచ్చి, భ్రూమధ్యమందు నిలిపి, చూపు మనసు వాయువుల నొకటిచేసి ధ్యానించవలయును.

౬ శాంభవీముద్ర రాజయోగం.

౫౩ అరకంటిచూపు భ్రూమధ్యమందు నిలిపి, చూడంగచూడంగ చంద్రుడు, సూర్యుడు, అగ్ని, ఇంద్రధనుస్సు, నవరత్నములు, నక్షత్రములు మెరుపులు మంటలు చీకటి వెలుతురు పంచభూతములు ప్రపంచములు మొదలైన చిత్కళలు గనిపించిపోయినపిమ్మట బట్టబయలు గనుపడును.

౭ ఆధారచక్ర నిర్ణయం.

౫౪ ఆధారచక్రమునకు గుదస్థానము, ౪ దళములు, వ శ ష స ౪ అక్షరములు, చతుష్కోణాకారము, పృథివీభూతము, కుంకుమవర్ణము, కింకిణీనాదము, సద్భక్తి, క్రియాశక్తి, ౬౦౦ హంసలు, గణపతి అధిదేవతయైయుండును.

౮ స్వాధిష్ఠానచక్ర నిర్ణయం.

౫౫ స్వాధిష్ఠానచక్రమునకు గుహ్యస్థానము, ౬ దళములు, బ భ మ య ర ల ౬ అక్షరములు, అర్థచంద్రాకారము, జలభూతము, విద్యుత్కాంతి, వీణానాదము, నైష్ఠికభక్తి, జ్ఞానశక్తి, ౬౦౦౦ హంసలు బ్రహ్మ అధిదేవతయైయుండును.

౯ మణిపూరకచక్ర నిర్ణయం,

౫౬ మణిపూరకచక్రమునకు, నాభిస్థానము, ౧౦ దళములు, డ ఢ ణ త థ ద ధ న ప ఫ ౧౦ అక్షరములు త్రికోణాకారము, అగ్నిభూతము, శ్యామలవర్ణము, వేణునాదము, అవధానభక్తి ఇచ్ఛాశక్తి. ౬౦౦౦ హంసలు, విష్ణు వధిదేవతయైయుండును.

౧౦ అనాహతచక్రనిర్ణయం.

౫౭ అనాహతచక్రమునకు హృదయస్థానము, ౧౨ దళములు, క ఖ గ ఘ ఙ చ ఛ జ ఝ ఞ ట ఠ ౧౨ అక్షరములు, షట్కోణాకారము, వాయుభూతము బంగారువర్ణము శంఖనాదము భవభక్తి ఆదిశక్తి ౬౦౦౦ హంసలు రుద్రుడధిదేవతయైయుండును.

౧౧ విశుద్ధచక్రనిర్ణయం.

౫౮ విశుద్ధచక్రమునకు కంఠస్థానము ౧౬ దళములు అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఏ ఐ ఓ ఔ అం అః ౧౬ అక్షరములు వర్తులాకారము ఆకాశభూతముస్ఫటికవర్ణము మేఘనాదము స్వానందభక్తి పరాశక్తి ౧౦౦౦ హంసలు ఈశ్వరుడధిదేవతయైయుండును.

౧౨ ఆజ్ఞేయచక్రనిర్ణయం.

౫౯ ఆజ్ఞేయచక్రమునకు నేత్రస్థానము ౨దళములు హం క్షం ౨ అక్షరములు త్రికోణవర్తులాకారముమహత్తత్వముమాణిక్యవర్ణము అబ్ధినాదము సమరసభక్తి చిచ్ఛక్తి ౧౦౦౦ హంసలు సదాశివుడు అధిదేవతయైయుండును.

౧౩ సహస్రారచక్రనిర్ణయం.

౬౦ సహస్రారచక్రమునకు మూర్ధ్నిస్థానము ౧౦౦౦ దళములుఓంకార బీజము, షట్కోణవర్తులాకారము, సాక్షిభూతము, చిత్రవర్ణము, ఝుంకారనాదము, పరమభక్తి, సహజాత్మశక్తి, ౧౦౦౦ హంసలు, గురుడు అధిదేవతయైయుండును.

౧౪ ఆత్మజ్యోతిస్థాననిర్ణయం.

౬౧ కొండమీదను ఒక పెద్దగుండు గుండునడుమను రెండు సల్లగుండ్లు ఆగుండ్లమధ్యను నక్కకూతలు కూతల నడుమను నూయినూతిమధ్యమున నాతి నాతిమీదను కోతికోతిమీదనుజ్యోతి వెలుగుచుండును

ఆ జ్యోతియే బ్రహ్మాండమంతయు జూచుచుండును అట్టిదానిని గుర్తెరిగి అదియే తానని యున్నవాడే ఆత్మవిదుడు.

౧౫ పరమాత్మస్థాన నిర్ణయం.

౬౨ చిన్మయనేత్రకమలమధ్యమున సూర్యచంద్రాగ్ని మండలములును మండలములయందు నీలమేఘమును మేఘమధ్యమున మెరుపును మెరుపుమధ్యమున నీవారశూకాగ్రమును శూకాగ్రమున పరమాత్మ అణుస్వరూపమై లోపలవెలుపల యేకముగా ప్రకాశించుచుండును.

౧౬ ప్రకృతి క్షర లక్షణం.

౬౩ జ్ఞానేంద్రియములు ౫, కర్మేంద్రియములు ౫, ప్రాణేంద్రియములు ౫, విషయేంద్రియములు ౫, అంతఃకరణములు ౪, యీ ౨౪ తత్వములతో గూడి ధవళశ్యామల రక్త పీత వర్ణములు నాలుగు గలిగినది ప్రకృతియనబడును.

అదియే క్షరము క్షేత్రము జడము దృశ్యము అవిద్య అజ్ఞానము అనాత్మ జీవము దేహము జగము సంసారము బంధము నరకము అనబడును.

౧౭ అక్షరస్వరూప లక్షణం.

౬౪ రక్త శ్వేత కృష్ణ పీత సునీలముల నడుమ నిర్వాతదీపమువలె శుద్ధస్ఫటికముండును అదినేవిద్యుల్లేఖ ఆపోజ్యోతి ఓంకారము అక్షరము మేరుశిఖరము కైలాసము సత్యలోకము వైకుంఠము తత్పదము త్వంపదము అసిపదము అనబడును.

౬౫ రక్త శ్వేత కృష్ణ పీత సునీలముల మధ్యను, సూర్యసోమాగ్ని మండలములమధ్యను, నాదబిందుకళల మధ్యను, గంగాయమునా సరస్వతులమధ్యను, అండపిండబ్రహ్మాండ భాండములమధ్యను అక్షరస్వరూపమైన ఆత్మ యున్నాడని యెరుగవలెను.

౪ అమనస్కయోగము. ౧౨

౧ ఆత్మసర్వగత లక్షణం.

౬౬ తిలలందు తైలము, దారువందు అగ్ని, దధియందు వెన్న, పుష్పమందు గంధము, ఫలమందు రసము, చేలమందు నూలు, తారహారాదులందు దారము, ఇసుకరాళ్లందు ఇనుము ఉన్నట్లు ఆత్మ సకలజగములయందును, సకలదేహములందును నిండియున్నాడు.

౨ దేహేంద్రియవిలక్షణం.

౬౭ నాతల్లి నాతండ్రి నాసతులు నాసుతులు నాపశువులు నా గృహము నాభూషణములు నావాహనములు నాక్షేత్రములు నా పాత్రములు నాధనము నాధాన్యము అన్నపురుషుడు యేలాగువేరుగా నున్నాడో, ఆలాగే నాశరీరములు, నాయింద్రియములు, నాజీవధర్మములు, నాగుణములు, అని అన్నిటిని ఎరిగెడిపురుషుడు ఆత్మయని తెలియవలెను.

3 ఎరుక నిర్ణయం.

౬౮ ఘటము పటము మఠము శఠము ఛటము యని మనము జనము ధనము ఘనము దినముయని హయము ప్రియము వ్రయము జయము భయము నయము యని శరము కరము నరము పురము పరము స్థిరము యని ఇది అది అది ఇదియని, యెరిగినది యెరుకని తెలిసికొనుము.

౬౯ అపశబ్దము సుశబ్దము ఉష్ణము, శీతము, మృదుత్వము, శుక్లము, రక్తము, కృష్ణము, మధురము ఆమ్లము, లవణము, సుగంధము దుర్గంధము, అని యెరిగినదే యెరుకసుమా.

అదియిదియని దేహజగత్తులకు లోపలవెలుపల యేయెరుక యెరుగుచున్నదో ఆయెరుకే ఆత్మయని తెలిసేది.

౪. నేతినేతియను మహావాక్య లక్షణం.

౨౦ పృథివి జలము అగ్ని వాయువు ఆకాశము నీవుగావు శ్రోత్రము త్వక్కు చక్షువు జిహ్వ ఘ్రాణము నీవుగావు. వాక్కు పాణి పాదము ఉపస్థ పాయువు నీవుగావు. సమానము వ్యానము ఉదానము ప్రాణముఅపానము నీవుగావు. శబ్దము స్పర్శము రూపము రసము గంధము నీవుగావు. మనసు బుద్ధి చిత్తము అహంకారము నీవుగావు. చిత్కళలు కర్మములునీవుగావు. అయితేనీవు సచ్చిదానందరూపమైన సాక్షివి అని యెరుగవలెను.

౨౧ షట్చక్రములు షడ్వర్ణములు అరిషడ్వర్గములు షట్కోశములు షడ్భ్రమలు షడ్వికారములు షట్సంపత్తులు షడ్గుణములు షడూర్ములు షణ్మతములు షట్శాస్త్రములు షట్కర్మములు నీవుగావు. సప్తధాతువులు సప్తకోటిమహామంత్రములు నీవుగావు. క్షరమును సదసత్తులు నీవుగావు. అయితే నీవు సచ్చిదానందస్వరూపుడవు అనీ యెరుగవలెను.

౨౨ అష్టతనువులు అష్టాత్మలు అష్టాంగయోగాదినిష్ఠలు అష్టమూర్తులు అష్టపురములు అష్టమదములు అష్టాబ్జములు అష్టపాశములు అష్టస్థలములు నీవుగావు. దశరంధ్రములు దశనాడులు దశవాయువులు నీవుగావు. పంచశక్తులు మూలప్రకృతి నీవుగావు. అయితే నీవు చైతన్యస్వరూపమైన సాక్షివని తెలిసికోనేది.

౫ సర్వంఖల్విదం బ్రహ్మ మనే శృతిపద్ధతి.

౨3 తత్పదము త్వంపదము అసిపదముఆత్మ అండపిండబ్రహ్మాండములు బ్రహ్మ సత్తుచిత్తులు సాక్షిరూపము క్షరమక్షరములు క్షేత్రక్షేత్రజ్ఞులు కర్మజ్ఞానములు స్థూల దీర్ఘములు సూక్ష్మము మొదలైన సర్వమునీవేలని తెలిసికోనేది.

౨౪ విశ్వసృష్టివి విశ్వేశుడవు విశ్వవంద్యుడవు విశ్వము నీవే. వేద వేద్యుడవు వేదాంతుడవు వేదస్థుడవు వేదము నీవే. యజ్ఞకర్తవు యజ్ఞ

భోక్తవు యజ్ఞరూపుడవు, యజ్ఞమునీవే. దేవదేవుడవు దేవాత్మకుడవు. దైవజ్ఞుడవు దైవమునీవే. శిష్యుడు దేశికుడవునీవే. సగుణనిర్గుణములునీవే. సాక్షినీవే యని యెరింగవలెను.

౬ పంచమహాతత్త్వ నిర్ణయం.

౭౫ భూమి జలములో, జలము అగ్నిలో, అగ్ని వాయువులో, వాయువు, ఆకాశములో, ఆకాశము మహదహంకారములో, మహదహంకారము మహత్తత్త్వములో, మహత్తత్త్వము అద్వయబ్రహ్మములో, ఐక్యము జేసినవాడు రాజయోగి యని తెలిసేది.

౭ జ్ఞానియొక్క లక్షణం.

౭౬ బ్రహ్మము దాన్తైక్యజ్ఞానము తెలిసితే, అజ్ఞానవృత్తు లణగును, అజ్ఞానవృత్తు లణగితే అవివేకవృత్తు లణగును, అవివేకవృత్తు లణగితే అభిమానవృత్తు లణగును, అభిమానవృత్తు లణగితే రాగాదులుపోవును రాగాదులు పోతే కర్మము తొలగును, కర్మముతొలగితే నిర్మలజ్ఞాని యగును.

౮ ప్రజ్ఞానం బ్రహ్మయనే శృతి లక్షణం.

౭౭ శ్రోత్రము, త్వక్కు, చక్షు, జిహ్వా, ఘ్రాణేంద్రియములచే శబ్ద, స్పర్శ, రూప, రస, గంధవిషయములను, వాక్కు, పాణి, పాద, గుహ్య, గుదేంద్రియములచే, వచన, దాన, గమన, ఆనంద, విసర్జన, విషయములను, మనసు, బుద్ధి, చిత్తము అహంకారేంద్రియములచే చలన, నిశ్చయ, చింతన, అభిమాన, విషయములను, యే జ్ఞానముచే యెరుగుచున్నదో, అదియే ప్రజ్ఞాన మనబడును.

౭౮ బ్రహ్మ, విష్ణు, రుద్రుడు యింద్రాదిదేవతలయందును, మనుష్య, అశ్వ, పశువులు, మొదలైన దోమలు, చీమలు, వరకుయుండెడి జీవులయందును గుర్తెరిగే చైతన్యమే బ్రహ్మమనబడును. గనుక బ్రహ్మమొదలు పిపీలికమువరకు యుండెడిశరీరములు వాచ్యార్థమని విడిచితే ప్రజ్ఞానము బ్రహ్మముఅనెడి పలుకుభేదములేక నిర్వస్తువ

క్కొటి అని యెఱుగవలెను.

౯ అహంబ్రహ్మాస్మి యనేశ్రుతి లక్షణం.

౭౯ బ్రహ్మవిద్యకు అధికారియయిన దేహమందు బుద్ధికిసాక్షి యై స్ఫురింపుచున్నదియేదో అది అహంఅనేపదమునకు అర్థమగును. ప్రతిలేనిదైస్వతస్సిద్ధమై పరమాత్మయైనవస్తువ, బ్రహ్మమనే పదమునకు అర్థమగును అహమే బ్రహ్మము బ్రహ్మమే అహమని తెలిసికొనుటయే అస్మిఅనేపదమునకుఅర్థమగును పిండబ్రహ్మాండ ములైన ఉపాధులువాచ్యార్థమనియెఱుగవలెను.

౧౦ తత్వమసియనేశ్రుతిలక్షణం.

౮౦ సృష్టికిపూర్వమందద్వితీయమైనామరూపక్రియాశూన్యమైయే కమైఅచలమై యేదియున్నదో అది తత్పదలక్ష్యార్థమగును. మోక్షా ధికారియందుమనోబుద్ధిచిత్తాది దేహేంద్రియముల కతీతమై సాక్షియై తేజరిల్లుచుండేది యేదో అది త్వంపదలక్ష్యార్థమగును.

పిండబ్రహ్మాండములైన వాచ్యార్థముల విడిచి ఒకదేహమునందొ క్క సాక్షినిన్ని బ్రహ్మాండాతీతమైన బ్రహ్మమున్ను అతడే సాక్షి సాక్షే అతడని ఐక్యపరచుటే అసిపదమునకు లక్ష్యార్థమగును.

౧౧ అయమాత్మబ్రహ్మయనేశ్రుతి లక్షణం.

౮౧ దేహేంద్రియాతీతమై స్వచ్ఛమై స్వప్రకాశమై అపరోక్ష మై ఆద్యంతశూన్యమై నిత్యమై శుద్ధమై బుద్ధమై సిద్ధమై యున్న ది వ్యబ్రహ్మమే. అయమాత్మయనేపదమునకు లక్ష్యార్థమగును.

బ్రహ్మాదిపిపీలికాంత తనువులచరాచరములకు సాక్షియై ప్రతిలేని దై నిరుపద్రవమై పరిపూర్ణమై బ్రహ్మమయమైయున్నదే బ్రహ్మపదము నకర్థమగును యీరెండు వక్కటేఅని తెలిసేది.

౮౨ నాలుగు మహావాక్యములందును. ఉపనిషద్భాష్య ములందును, యోగశాస్త్రములందును, మంత్రశాస్త్రములందును నీవే బ్రహ్మము, బ్రహ్మయే నీవని చెప్పబడెను.

౮౩ బ్రహ్మ క్షత్రియ వైశ్యాదివర్ణములును, బ్రహ్మచర్యాది ఆశ్రమ ధర్మములును, స్వజాతి విజాతి స్వగతభేదములును, నామ రూపకులగోత్రములును, ఖేదమోదములును. వాదభేదములును, నీకు లేవని తెలిసికొనుము.

౧౨ అంటియంటని లక్షణం.

౮౪ తామరాకునందు నీరు, అద్దమందు రూపము, బురదలో కుమ్మరపురుగు నాలుకకు నెయ్యి బొబ్బరయందు చింతపండు చల్లలో వెన్న, సూర్యునకు చీకటి, ఆకాశమునకు వాయువు, యేలాగు నంటదో ఆలాగే జ్ఞానులు ప్రపంచమందు వ్యవహారములు చేసి అంటకన్ని యెరుగవలెను.

---

౫ పరిపూర్ణ బోధ. ౨౦

దృష్టాంత ద్రాష్టాంతములచేత ద్వాదశియును, షోడశియును పరిష్కారమైతే సరి.

౧ గురువాక్యములు.

౮౫ సకలదేశములందు సకలకాలములందు సకలవస్తువులందు చలనములేక చావుపుట్టువులేక, తనకుదాను స్వతస్సిద్ధమైయున్న యీ పుత్తబట్టబయలుతప్ప యేమీలేదు. కలలోగనుపడిన గజమును మేలుకొనిచూడగా యేలాగులేదో ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. ఇది గురుముఖముగావిచారించవలెను

౮౬ ఈ పుత్తబట్టబయలు యేమీలేదు అనే ద్వాదశాక్షరిని చక్కగా తరచి తరువాత కలలో దోచిన శరీరాలు యేలాగో ఆలాగే మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమీలేదు. అనే షోడశాక్షరిని సదా మరవకయుండవలెను. ఇట్టిగురువాక్యములను అశ్రద్ధజేయక ద్వాదశిని నిశ్చయముచేసి, షోడశిని విడిచిపెట్టితే పరిపూర్ణమైయుందును. ఇదియే జననమరణ భ్రాంతిరహితమైన అచలసూత్ర మని యెరుగవలెను.

౨ కేవలాత్మ లక్షణం.

౮౭ పృథివిజలము అగ్ని వాయువు ఆకాశములోను సురులు నరులు గిరులు చరులు తరులు హరులు కరులు లోను ఊళ్ళు కూళ్ళు రాళ్ళు రోళ్ళు తేళ్ళు కోళ్ళు తేళ్ళలోను గొల్లు గుల్లు బుల్లు వల్లు చీమలు దోమలు పాములలోను సకలచరాచర జంతుజాలముల యందును చలించక త్రికాలములయందును ఉపాధులను జెందక అచలపరిపూర్ణమైయున్నది. కేవలాత్మయనబడును.

౮౮ సృష్టికిముందు వెనక యిప్పుడు యెప్పుడు పుట్టకగిట్టక సకలదేశములందు సకలకాలములందు సకలవస్తువులందు చలనములేక తూర్పుదక్షిణపశ్చిమోత్తరముల నాలుగుదిక్కులు మూలలు విూద నడుమ క్రింద అంతట అచలమై ఆదిమధ్యాంతశూన్యమై పరిపూర్ణమై బట్టబయలుగా నున్న వస్తువే కేవలాత్మ యని చెప్పబడును.

౩ ద్వయదోషరహిత లక్షణం.

౮౯ సగుణనిర్గుణములు సదసత్తులుసాకారనిరాకారములు క్షేత్రక్షేత్రజ్ఞులు జీవజగములు కారణకార్యములు పాపపుణ్యములు బంధమోక్షములుజ్ఞానకర్మములుక్షరాక్షరములుసత్యాసత్యములు ఖండాఖండములు రాకపోకలు యీమొదలైన ద్వయదోషములు లేకయుండినది పరిపూర్ణమనబడును.

౪ ఉపాధిరహిత లక్షణం.

౯౦ పరిపూర్ణము భూమిలోనణగదు నీళ్ళలో మునగదు అగ్నిచే కాలదు గాలికి కూలదు చేతులకు చిక్కదు రాళ్ళచే పశులకు వానకు దడువదు నడిగంట్లచే నొవ్వదు అస్త్రశస్త్రములచే హతముగాదు యెండకు యెండదు నీడకు రాదు పాశములచే కట్టుబడదు చలికి వణకదు భయములకు కులికిపడదని యెరుగవలెను.

౫ ఆత్మానాత్మరహిత లక్షణం.

౯౧ ప్రకృతి ద్వయ దోషరహితమైన పరిపూర్ణమునకు స్థా

లసూక్ష్మకారణ మహాకారణ దేహములును జాగ్రత్ స్వప్న సుషుప్తి తుర్యావస్థలను విరాడ్ఢిరణ్యగర్భఅవ్యాకృత సర్వసాక్షియగు ఈశ్వరతనువులును విశ్వ తైజస ప్రాజ్ఞ ప్రత్యగాత్మాభిమానులును లేవని యెరుగవలెను.

౩. వ్యాప్త్యపేత లక్షణం.

నం౨ అచలపరిపూర్ణ కేవలాత్మ పుట్టక గిట్టక పట్టక ముట్టక కొట్టక తిట్టక కట్టుపడక యెరుగక మరవక కరగక నొరుగక పెరుగక విరుగక తరుగుపడక యాడక పాడక వాడక యోడక నేడక గూడక జూడబడక యదరక బెదరక గదరక చదరక సుదరక పదరక గదలబడక జనగక పెనగక జనగక వినక కనక ఖేదమోదద్వయము లేక యుండును.

నం౩ సర్వకాలసర్వావస్థలయందు చలించక పరిపూర్ణమైయున్న బట్టబయలు పతియు సతియు రతియు ప్రతియు స్తుతియు యుత్పత్తియు స్థితియు మృతియు స్మృతియు శృతియు ధృతియు కృతియు వికృతియు హంకృతియు క్షితియు మతియు మితియు ఖ్యాతియు యతియు మూలప్రకృతియు గతియు దుర్గతియు సద్గతియు గతము విగతము ఆగతము యీమొదలైనవి యేదిగాదు.

౪ ఇంద్రియాతీత లక్షణం.

నం౪ శ్రోత్ర త్వక్చక్షు జిహ్వా ఘ్రాణములచే కేవలాత్మను తెలియుటకుకాదు అది శ్వేత పీత రక్త నీలాది వర్ణములుగాదు కటు లవణ ఆమ్ల తిక్త కషాయ మధురాది రసరుచివస్తువులుగాదు వీణవేణుతాళ మృదంగాది ధ్వనులుగాదు పరిమళమిశ్రద్రవ్యములుగాదు కఠినశీతోష్ణ మృదుత్వములుగాదని యెరుగవలెను.

౫ పరిపూర్ణ లక్షణం

నం౫ ఆదిమధ్యాంతమైన అచలపరిపూర్ణము రెండోప్రకారముగాదు క్రిందటగాలేదు ముందరగాబోదు యిప్పుడుగాలేదు యికగా

నేగాదు అదియెప్పుడు ఒక్కతీరుగా నిలిచి కదలక మెదలక వదలక బెదరక యుండును. ఈప్రపంచమునకు ఆపరిపూర్ణమునకు సంబంధము యెన్నడులేదు. చావుపుట్టుకలుగలిగినది ప్రపంచము. చావుపుట్టుకలు లేనిది పరిపూర్ణమనబడును.

౯ యెరుకనిరసన లక్షణం.

౯౬ ఆదిమధ్యాంత శూన్యమైన అతీత అచలపరిపూర్ణబ్రహ్మమందు పంచభూతములు పుట్టలేదు. బాధముక్తులు లేని పరిపూర్ణమందు పంచకోశములు పుట్టలేదు. జ్ఞానకర్మములులేనట్టి బట్టబయలందు ప్రకృతిద్వయములు పుట్టలేదు. అచలమునందు మాయావిద్యాపాధ ద్వయదోషములు జగయుగములు జీవేశ్వరులు స్థావరజంగములు యెన్నడును పుట్టలేదు.

౧౦ దృష్టాంత లక్షణం.

౯౭ దేవతలు రాక్షసులు బ్రాహ్మణులు కోమట్లు శూద్రులు దిగంబరులు ఋషులు యోగులు భోగులు రోగులు త్యాగులు తరులు ఖేచరులు వానరులు గిరులు రాజులు మంత్రులు రథములు తురగములు శరచాపధనులు భీకరులు యేనుగులు యీమొదలైనవి కలలో యెక్కడనుంచివచ్చిన దానిగాని మేల్కొని చూచితే యెక్కటియు లేదు. ఆప్రకారము యీప్రపంచము యేమియులేదు. బట్టబయలైన అచలపరిపూర్ణముమాత్రము ఎప్పటికి ఒక్కతీరుగానుండును.

౧౧ ప్రకృతిద్వయసృష్టిరహితం.

౯౮ క్షరమక్షరములు సగుణనిర్గుణములు సత్యమసత్యములు సత్తుచిత్తులు కారణకార్యములు జ్ఞానకర్మములు పురుషప్రకృతులు యెరుకమరుపులు పాపపుణ్యములు బంధమోక్షములు జననమరణములు జడాజడములు క్షేత్రక్షేత్రజ్ఞులు జీవదేహములు మానాభిమానములు మంచిచెడ్డలు మొదలైన యిట్టిప్రకృతిద్వయములు బట్టబయలందు యెప్పుడు పుట్టలేదు.

### ౧౨ మాయపేరులు.

౯౯ చైతన్యమన్న క్షేత్రజ్ఞుడన్న జ్ఞానమన్న అహంకారమన్న సద్రూపమన్న చిద్రూపమన్న సస్వరూపమన్న సాక్షియన్న ఈశ్వరుడన్న విష్ణువన్న పరమాత్మయన్న బ్రహ్మమన్న ఆదిశక్తియన్న ఆనందమన్న పరమపదమన్న ప్రకృతియన్న యీమొదలైన పరినామములు మాయకేగాని బట్టబయలుకులేదు.

### ౧౩ కాలాతీత లక్షణం.

౧౦౦ కేవలాత్మ బ్రహ్మకల్పములు యుగములు సంవత్సరములు మాసములు పక్షములు తిథివారనక్షత్రములు గ్రహయోగకరణ లగ్నములు పర్వములు ఋతువులు పగల్లురాత్రులు చీకటివెలుతురులు మేఘములు యుదయాస్తమయములు చంద్రసూర్యగ్రహణములు త్రివిధకాలములు దిశలు నాదబిందుకళలు ఆకాశము జీవనిర్జీవములు మొదలైనవి గాదు.

### ౧౪ హేతృత్వరహితము.

౧౦౧ కేవలాత్మకు కర్తృత్వము భోక్తృత్వము స్మర్తృత్వము మంతృత్వము జ్ఞాతృత్వము శ్రోతృత్వము ఘ్రాతృత్వము వక్తృత్వము ధ్యాతృత్వము వేతృత్వము ధాతృత్వము పాతృత్వము శత్రుత్వముమిత్రుత్వము జైతృత్వము గోత్రసూత్రములు అపవిత్ర పవిత్రగాత్రములు మొదలైనవిలేవు.

### ౧౫ విషయరహిత లక్షణం.

౧౦౨ దయయు భయము, ధైర్యము శ్రద్ధయులజ్జ శమము దమము దర్పము అహంకారము ఇచ్ఛయు దంభము వైస్యము మదము లోభము మోహము కామము క్రోధము మాత్సరము సుఖము దుఃఖము క్షయము వృద్ధియు క్షుత్తుయు పిపాసయు సంశయము నిశ్చయము సంకల్పము వికల్పము కంపనము ఆకుంచనము గమనము చలనము శ్వాసము నిశ్వాసము విసర్గము వ్యాపకము రాగము

షము కుటిలము గర్వము వేషము భాషయు వినయము మానము అభిమానము మొదలైనవిషయసంఘములు కేవలాత్మకు లేనని యెరుగుము.

౧౬ బోధస్థితిపురుష లక్షణం.

౧౧౩ ఈ ప్రత్తిబట్టబయలు యేమీలేదనువాడు రాగవిరాగములు లేనివాడు మూలం లేని యీ గుర్తెరిగే శరీరంయేమీ లేదనువాడు జ్ఞానాజ్ఞానములు లేనివాడు ప్రశ్నదిప్రశ్నట్టు పండజూచినవాడు సుకర్మదుష్కర్మలేనివాడు లేనిమాయావిద్యలు యేమీలేదనువాడు సర్వజ్ఞత్వకించజ్ఞత్వములు లేనివాడు మిథ్యాజగములు లేదనువాడు బాధమోక్షములు లేనివాడని యెరుగవలెను.

౧౧౪ ఈ ప్రత్తిబట్టబయలు యేమీలేదు ఉదితఃకుతానే స్వతస్థితమై పరిపూర్ణముగా యున్నది. అందులో కలలోగనుగొన్న గజము యేమీలేనటుల మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. యిదే గురువాక్యము యింతకెంత యెక్కువలేదు. యిదే రాజమార్గము యిదే అనాయాసము యిదే భ్రాంతిరహితము యిదే స్థిరము దీనినమ్మినవారికి యేబాధలు యుండవు. జననమరణములు తొలగిపోవును అని తెలుసుకొనవలెను.

---

౬ గ్రంథసమాప్తము. ౮

౧ గ్రంథఫలము.

౧౧౫ బ్రాహ్మణులు క్షత్రియులు వైశ్యులు శూద్రులు యెవరైన భక్తితో యీపద్యములువిని వ్రాసుచదివినయెడల వారికి సౌఖ్యములును ధనము ధాన్యము వస్త్రములు నగలు సతులు సుతులు స్నేహితులు బంధువులు యేనుగులు గుర్రములు పశువులు పల్లకీలు అతిథిపూజలు ఆయురారోగ్యఐశ్వర్యములుగలిగి మోక్షమునుపొందగలరు ఇదిసత్యము మనోహరమైనగుణములతో ప్రకాశించుచు భద్రాచలముననుండు శ్రీరామా పరశురామనరసింహదాసునిరక్షిం

చుహామముగలవాడా

## ౨. గ్రంథకర్తస్థితి

౧౦౬. ఈజగతిలో ప్రఖ్యాతిజెందిన పరశురామవంశమనే సము ద్రమునకు చంద్రుడును పరిపూర్ణజ్ఞానస్వరూపుడును అయి నకోటీశ్వ రునకు సుబ్బమాంబకు పుత్రుడనై నరసింహదాసుయను పేరుచే ప్ర సిద్ధిజెంది కంబాలూరి అప్పరావు సద్గురుకరుణాకటాక్షముచే బ్రహ్మ విద్యయగు వేదాంతసారసంగ్రహమును చక్కగా గ్రహించి నూటయె నిమిదిపద్యములుజెప్పి మీకుయర్పించినాను మనోహరమైన గుణముల తో ప్రకాశించుచు భద్రాచలముననుండు శ్రీరామా పరశురామ నరసింహదాసుని రక్షించు నామముగలవాడా.

## 3 కంఠమాల.

౧౦౭ భక్తితోజెప్పిన ఈ నూటయెనిమిది పద్యములే ముత్యము లు యతిప్రాసములే బంగారుకొలుకులు శబ్దములుజేర్చడమే పరమ తత్వార్థమైన పచ్చలపతకము మీయంకితమే మేరుపూస ఈప్రకార ముగా ముత్యములహారముజేసి సంతోషముతో నర్పించి నమస్కా రముజేసినాను గనుక కంఠమునందు ధరియించి గౌరవమును ప్రకా శింపజేసి నన్నుకాపాడవలెనని యెల్లప్పుడునిన్ను నమ్మినాను మనో హరమైనగుణములతో ప్రకాశించుచు భద్రాచలముననుండు శ్రీరా మాపరశురామనరసింహదాసుని రక్షించునామముగలవాడా.

## ౪ మంగళారతి.

౧౦౮ దశరథమహారాజుసుపుత్రుడా రాక్షసులను సంహరించిన వాడామందరపర్వతముతో సమానమైనధైర్యముగలవాడా కమలము లవంటి నేత్రములుగలవాడా నీలమేఘమువంటి శరీరముగలవాడా మునిబృందములచే స్తుతియింపబడినవాడా సూర్యవంశమును అభివృ ద్ధిపరచినవాడా భక్తజనులను రక్షించినవాడా మారీచుని సంహరిం చినవాడా లక్ష్మీదేవియొక్క మనసునుసంతోషపరచినవాడా బంగా

రమణీయమైన వస్త్రములు ధరించినవాఁడా ప్రశస్తమైనగుణములుగల వాఁడా మన్మథునితో సమానమైనరూపముగలవాఁడా రఘువంశమున కు శూరుఁడా మీకునెల్లప్పుడు శుభములు కలుగుగాక మనోహరమైన గుణములతో ప్రకాశించుచు భద్రాచలమునందుండు శ్రీరామాపర నామ నరసింహదాసువిరచించు నామముగలవాఁడా.

---

ఇతి శ్రీసచ్చిదానంద వేంకటేశ్వరస్వామి విరచిత
శ్రీ శివరామదీక్షితగురుపీఠ వేదాంత సార
సంగ్రహ భద్రాద్రిరామశతక
భావార్థంసంపూర్ణం.
శ్రీసద్గురుచరణారవిందార్పణమస్తు.

## శుద్ధపత్రిక.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧ | ౧౮ | నిజభక్తులైన | ప్రియశిష్యులు |
| ౭ | ౧౧ | గి జల | జల |
| ౯ | ౧౨ | అత్మ | ఆత్మ |
| ౯ | ౨౩ | జీవ్రుండు | జీవుడు |
| ౧౧ | ౨ | స్మప్న | స్వప్న |
| ౧౧ | ౧౪ | శరీర | శరీరము |
| ౧౦ | ౨౨ | వైర్యము | ధైర్యము |
| ౧౨ | ౨ | గుబ్బలు | గుల్భలు |
| ౧౨ | ౧౮ | మోసాయలు | మోహములు |

శ్రీ సద్గురవే నమః

శ్రీ శివరామదీక్షిత అచలగురుపీఠ

# వేదాంత గ్రంధములు.

| | | |
|---|---|---|
| ౧. | శ్రీశివరామదీక్షితకృత బృహద్వాశిష్టము | ౧—౦—౦ |
| ౨. | భద్రాద్రిరామశతక భావార్థము | ౦—౧—౦ |
| ౩. | శుద్ధనిర్గుణతత్వకందార్థములు, కందపద్యములు మొదలైనవి | ౨—౦—౦ |
| ౪. | సుజ్ఞానదీప మను గురుగీతశ్లోకములకుటీకాతాత్పర్యము | ౧—౮—౦ |
| ౫. | సుబోధరత్నాకర మను వేదాంతఅచలతత్వములు | ౦—౪—౦ |
| ౬. | అచలతత్వశిరోమణి అఖండమాల మొదలైనవి | ౧—౮—౦ |
| ౭. | మహా అద్వైతసిద్ధాంత పరమతత్వ కందార్థములు | ౦—౪—౦ |
| ౮. | సద్గురుభక్తిశతకము | ౦—౧—౦ |

ఈ గ్రంధములు వలయువారు బెజవాడ మల్లికార్జునపేట రామానుజయ్యగారి మఠములో శ్రీ శివరామదీక్షితగురుపీఠ అచల బోధకులైన శ్రీ సచ్చిదానందవేంకటేశ్వరస్వాములవారికి వ్రాసి తెప్పించుకొనవచ్చును.

సికింద్రాబాదు జనరల్ బజారులో మ. రా. సరాఫు బుచ్చన్నగారివద్దకూడా యీగ్రంధములు వెలకు దొరకును.



